

# ఓం భగవాన్ శ్రీ చిన్న బాలయోగీశ్వరులు

**జననం : 03-11-1941, తపస్సు ప్రారంభం : 26-03-1950**

**కైవల్యసిద్ధి : 28-10-1991**

# శ్రీముమ్మిడి వరము బాలయోగీశ్వర స్తవము

Permitted to Scan this book to keep [illegible] Digital Library Project



23/4/08

[illegible]



ఓం భగవాన్ శ్రీ పెద్ద బాలయోగీశ్వరులు

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి - 2003

కాపీలు : 2000

వెల : 10-00 రూ॥లు



**డా॥ విష్ణు ప్రసాద్ .కె**

యం.యస్. (ఆర్థో), యం.సిహెచ్. (న్యూరో)

ఫెల్లో - మైక్రో న్యూరో సర్జరీ - జపాన్,

ప్రొఫెసర్ - న్యూరోసర్జరీ & చీఫ్ న్యూరో సర్జన్,

ఉస్మానియా జనరల్ హాస్పిటల్, హైదరాబాద్.

1) న్యూరో క్లినిక్, 1-9-1122/5/డి, ఫస్ట్‌ఫ్లోర్,
ఆంధ్రమహిళా సభ హాస్పిటల్ ఎదురుగా,
విద్యానగర్, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 040-27608788

2) 45-58/7/7, నర్సింహానగర్,
విశాఖపట్నం - 530 024.
ఫోన్ : 0891-2799865.

బుక్ డిజైనింగ్ :

**సిటీ గ్రాఫిక్స్ (భరత్ కుమార్ జంబిరాల)**

నల్లకుంట, హైదరాబాద్.

ప్రింటింగ్ :

**దత్తసాయి ప్రింటర్స్**

చిక్కడపల్లి, హైదరాబాద్.

**K.S.R. MURTHY,** IAS (Retd.)
Former Secretary to Govt. of India
Former Member of Parliament
(LOK SABHA)
Spokes Person, A.P.C.C.

सत्यमेव जयते

# 58/A, Durga Vihar Colony,
Gun Rock Avenue,
Timulgherry,
Secunderabd - 500 015.
& : 040-7992828.
Fax : 040-7992838.

Date ; 22nd February, 2003

# FORE WORD

I am very happy that Bhagawan Sri Sri Sri Pedda Balayogiswarlu's devotee Shri Kotipalli Potha Raju Garu, his wife Smt. Savithri Devi and their son Professor Dr. Kotipalli Vishnu Prasad have brought out this small, but useful book on Bhagawan. Their experiences so devotedly expressed, I am sure will be useful to the pilgrims who would read this book. I wish them all the best and pray that Bhagawan's blessings will continue to be showered on them in the years to come.

**-K.S.R. MURTHY,**

# తొలిపలుకు

శ్రీశ్రీశ్రీ భగవాన్ పెద్ద బాలయోగీశ్వర్లు శ్రీమతి రామమ్మ గంగయ్య పుణ్య దంపతులకు ప్రమోదూత నామ సంవత్సర కార్తీకశుద్ధ విదియా గురువారము స్వాతీ నక్షత్రము తేదీ 23వ అక్టోబరు 1930 కోనసీమయందు ముమ్మిడివరం గ్రామము, తూర్పుగోదావరి జిల్లాలో జన్మించిరి.

శాస్త్రజ్ఞానముగాని, సద్గురువుగాని, దేశాటనముగాని లేకునన్నను, 16సం।లు నిండక పూర్వమే సంసారపాశముల నొక్కతృటిలో ఖండించి, తేది 22-06-1946 శనివారమున గ్రామ సమీపములో దక్షిణముగా ఉన్న కొబ్బరితోటలో వారి సుకృతము ఫలించి శ్రీ బాల యోగీశ్వరుండు తపస్సునకు కూర్చున్నారు. నాటి నుండి కఠోర తపస్సు చేసి ఆకలి దప్పులను జయించిరి, వారి భక్తుల కోరిక మన్నించి తేది 27-03-1949న తత్వోపదేశము చేసియున్నారు.

## తత్వోపదేశము

"భగవంతుని" ధ్యానము చేయుటకు అరణ్యమునకు వెళ్ళవలసిన అవసరములేదు. భగవంతుడు ఇచ్చటా ఉన్నాడు, అచ్చటా ఉన్నాడు 'అంతటా ఉన్నాడు'. అరణ్యమునకు వెళ్ళవలెనంటె శాంతము కొరకు వెళ్లవలెను.

భక్తుల దర్శనము పాపనాశనము ఈ జన్మలో భగవంతుని తెలిసికొనుటకు ప్రయత్నము చేస్తేనే ముందుజన్మలో పైమెట్టుకు పోవుటకు వీలగును. లేకపోతే తిరిగి నరజన్మ వచ్చుట దుర్లభము.

ఒక మహాభక్తుడు ముక్తిజెందితే 14 తరాలవారు ముక్తిజెందుతారు.

జన్మరాహిత్యము చేసికొని మహా స్వర్గమునకు (ఐక్యము) ఎవ్వరైతే వెళ్ళుదురో ఆ మహనీయునికే అంతా శాశ్వతము.

తనువులు శాశ్వతము కాదు. ధనము, భూములు శాశ్వతముకాదు. క్రియకు ఏమి శాశ్వతంకాదు.

ఉన్నన్నాళ్ళూ నీది, నాది అనుకొనుటయే గాని క్రియకు వచ్చేదికాదు. అంతా భగవంతునిదే.

ప్రపంచమందు ఒక సూర్యుడే ఇంత ప్రకాశముగా ఉన్నాడు. "కోటి సూర్యప్రకాశము" గల భగంతుడు ఎంత ప్రకాశముగా ఉండును? ప్రపంచమందు ప్రజలకే ఎన్నో తెలివితేటలుంటే ఆ భగవంతునకు "ఎన్నెన్ని" తెలివితేటలుండవు ? భగవంతుడు మనకు తండ్రికదా ! ఆ మహాత్ముని పూజింపలేమేమి ?

అన్నదమ్ములు, తల్లిదండ్రులు, "అంతామాయ" మనకు నిజమైన తండ్రి భగవంతుడు. ఆయన మన కన్నులకు కనుపించడు. ఆయనను మన "కన్నులతో చూడవలెనంటే" అన్ని బాధలను జయించవలెను. మన ఆత్మలో ఉండే జీవాత్మను గ్రహించవలెను.

శాశ్వతకాలము ఉండే భగవంతునకు కోపములేదు. "మూడురోజుల ముచ్చట కొరకు ప్రజలకు ఇంత కోపమేల ? కష్టములేకుండ ఏ పూటకు ఆ పూట గడుస్తుంటే అదే మహాభాగ్యము.

జీవాత్మ భగవస్స్వరూపము, పంచభూతములు దానిని "మాయలోనికి" లాగుచుండును. "తానెవ్వరో తాను తెలుసుకొని చలించే మనస్సును కట్టిపెట్ట గలిగితే" ఒక గురువు చెప్పనవసరము లేదు. తన ఆత్మే తనకు గురువగును. ఆత్మను పవిత్రముచేస్తే ఆత్మలో ఉండే జీవాత్మ అంతా తెలియచెప్పును.

ఆహారమువల్ల ఇంద్రియములకు బలము కలుగును. ఇంద్రియములను లోబరచుకొనవలెనంటే ఆహారమును తగ్గించవలెను. మానవలెను. అందువలన ఇంద్రియములను లోబరచుకొనవచ్చును. అప్పుడు పంచభూతములు ఆత్మలో అణగిపోయి ఎరుకలేకపోవును. ఎరుకలేనప్పుడు ఆహారము అక్కరలేదు. అందువల్ల జీవాత్మ "పరమాత్మలో ఐక్యమగుటకు" వీలు చూపును.

ఆహారము తీసుకొనుచు తపస్సు చేయవచ్చును. కాని దానివలన చాలా బాధలున్నవి సంసారములోనుండియు, చక్రవర్తితనము చేయుచు భగవంతుని స్మరణ చేయవచ్చును. కాని నిలకడ ఎక్కడనుండి వచ్చును ? చలనము కలుగుచుండును. ఒక్కొక్కప్పుడు అఖండమైన బాధలు కలుగుచుండును. ఆ బాధలను జయించగలిగితే భగవంతునకు అఖండమైన "జాలి పుట్టును".

భగవంతుడు తలంచుకొంటే అందరూ మంచివారని అనిపించుకోవచ్చును. అలాగైతే ముక్తిని ఇవ్వవచ్చును. కాని అలా వీలేలేదు. ఎవరిదారి వారే తెలుసుకోవలెను. ఒకరికి ఒకరు ఏమీ చేయరు.

ఒకరు చేసుకున్న పుణ్యముకొలదీ భగవంతుని అనుగ్రహము కలుగును. అపరాధములు ఉంటే కనికరము కలుగదు. పూర్తిగా ఎవ్వరైతే తన్ను "నమ్ముతారో" వారిపై భగవంతునకు కనికరము కలుగును.

ఎక్కువలోపుట్టినా, తక్కువలోపుట్టినా తనువులు శాశ్వతముగాదు. ఎందులో పుట్టినా భగవంతుని ఎవరైతే నమ్ముతారో వారికే ముక్తిమార్గము లభించును.

భగవంతుడు కనుపించేవరకు ఎవ్వరైన తపస్సు చేయవలెను. ఆ చేయడము విఘ్నమయితే ఆ జన్మమట్టుకు చేసింది అంతావృథా. కాని వచ్చే జన్మలో దాని లాభము కలసివచ్చును.

తపస్సు వలన ఏది కావలసివస్తే అది వచ్చును. చక్రవర్తితనముకూడ వచ్చును. కాని దానివలన గర్వము కలగును. గర్వపడితే దిగువజన్మలోనికి పోవలసి వచ్చును.

సర్వము ఒకచోట కనబడాలి అంటే తపస్సు వలననే వచ్చును. మాటలతోరాదు. తల్లిదండ్రులు భార్యా పిల్లలు మీ పాపములు పంచుకొనరు. అందుచే మీరు వాళ్ళకొరకు పాపములు చేయుట ఎందుకు ?

## మహా మహిమలు

తేది 12-11-1949 మధ్యాహ్నము తపోమందిరము ఉత్తరగది రంధ్రము ద్వారా కొందరు భక్తులు లక్ష్మీనారాయణుల స్వరూపములను జూచిరి. లక్ష్మీనారాయణ పాదపద్మములను దర్శించితిమని శ్రీ స్వామి నారాయణ గారు తమ పుస్తకమున వ్రాసియున్నారు.

తేది 19-11-1949 మధ్యాహ్నము 4-00 గం॥ల తరువాత తపోమందిరము తలుపులకు నిలువుగా ఒక అంగుళమునకు మించిన ఖాళీ స్థలము ఏర్పడి శ్రీ స్వామి నాయనగారు దివ్యతేజోమయమగు జగన్మాతను చూచినట్లు తమ పుస్తకమున ప్రకటించిరి.

తేది 16-02-1950 నాస్తికుడైన కోట్నీసు శ్రీ బాలయోగీశ్వర మందిరమున శ్రీకృష్ణుని జూచినట్లు దేశసేవ పత్రికయందు ప్రకటింపబడెను.

మొట్ట మొదటి సారిగా నాకు 1968 శివరాత్రికి శ్రీశ్రీశ్రీ ముమ్మిడివర బాలయోగీశ్వర స్వామి వారి దర్శనభాగ్యము కలిగినది. శ్రీ స్వామి వారి దివ్య మంగళ రూపముగని మిక్కిలి సంతోషముగా నేనుండగా

వందనము బాలయోగికి
వందనమిదె సకల లోక వంద్యున కెపుడున్
వందనము మౌనయోగికి
వందనములు నేనొనర్తు వందలు వేలున్

అనే ఒక చిన్న కవిత నా మదిలో సెలయేరులా పారింది. అప్పుడది మొదలు నిండుగా నా మదిలోనూ, ఉచ్ఛ్వాస నిశ్వాసాలలోనూ, నా తలంపులోనూ ఇప్పటివరకు స్వామివారు ఉంటూనే ఉన్నారు. శ్రీ బాల యోగీశ్వర స్వామి అనుగ్రహమే నాచే ఈ పద్య సంపుటిని వ్రాయించింది.

శ్రీ బాల యోగీశ్వర స్వామి వారి పుట్టుకను, తత్వోపదేశాల్ని, మహిమలనీ వివరిస్తూ పద్యములు మరియు బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి అనే మకుటంతోనూ ఈ సంపుటిని వ్రాసితిని.

నాచేతిలో కలాన్ని శ్రీ స్వామివారే కదిలించి నాచే ఈ కవితా సంపుటిని వ్రాయించారన్నది నా ప్రత్యక్ష అనుభవ భాగ్యము.

తేది 19-07-1985 శ్రీశ్రీశ్రీ పెద్ద బాలయోగీశ్వర స్వామి వారు కైవల్యసిద్ధి పొందిరి. కాని స్వామివారు ఇప్పటికీ, ఎప్పటికీ సజీవంగానే ఉన్నారు, ఉంటారు. కోటి సూర్యుల ప్రకాశముగా దర్శనమిస్తున్నారు. పిలిచిన పలికే దైవం, కోరుకున్న వారికి కొండంత అండ. 39 సంవత్సరాలు సుదీర్ఘ తపోశక్తివలన రానున్న కొన్ని వేల సంవత్సరాలు మానవాళిలో ప్రశాంతత సమకూర్చుటకు, భగవద్భక్తిని కలిగించుటకు దివ్య తేజస్సుతో సజీవంగా ఉంటారు. భక్తులకు స్వామివారి ఆశీస్సులు ఎల్లవేళలా ఉండును !

స్వామివారి దివ్య ఆద్భుతచరిత్రని ఘనంగా పొగిడి, వారి అమృత సందేశాన్ని ఈ ప్రపంచానికి అందజేయలేకపోతినే అన్నదే నా మనసులో చిరకాల చింత. నా జీవిత కాలపు కోరిక అయిన ఈ సంపుటిని శ్రీ భగవాన్ బాలయోగి స్వామి వారికి సమర్పణ చేసుకొనే భాగ్యాన్ని నాకు కలుగజేసిన శ్రీశ్రీశ్రీ భగవాన్ బాలయోగీశ్వర తపో ఆశ్రమ కమిటీ, ముమ్మిడివరము వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

రచయిత

# సమర్పణ

సర్వకాల సర్వావస్థలయందు

మమ్మల్ని కంటికి రెప్పలా కాపాడే మా దేవుడా,

మముగన్న మా తండ్రీ

శ్రీశ్రీశ్రీ భగవాన్ బాలయోగీశ్వర స్వామి

ఈ సంపుటాన్ని నీ పాదపద్మములకు

సమర్పించుకొనుచున్నాము.

స్వీకరించి మమ్ములను అనుగ్రహించు స్వామీ !

కోటిపల్లి పోతరాజు

# శ్రీశ్రీశ్రీ భగవాన్ బాలయోగీశ్వరాయ నమః

# శ్రీముమ్మిడి వరము బాలయోగీశ్వర స్తవము

1. వందనము బాలయోగికి
వందనమిదె సకల లోక వంద్యున కెపుడున్
వందనము మౌనయోగికి
వందనములు నేనొనర్తు వందలు వేలున్

2. కొలుతును నీ చరణములను
తలతును నీ దివ్యనామ స్మరణంబెపుడున్
మలతును నీపై కవనము
నిలుతును నీ భక్త కోటి నగ్రమునందున్

3. కుందనపుమేని ఛాయయు
మందరగిరిబోలునీదు మహిత దీక్షయున్
సందియములేని మహిమయు
బృందావన విహారుస్తవము డెందమునందున్.

4. ఊరా ? ముమ్మిడివరమట
పేరా ? గంగయ్యబరగు పృథివీస్థలిలోన్
కారే ? ఘనమగు కీర్తికి
వారే ! వారసులు యిలను వినుతింపగనున్.

5. అమ్మయను మాట కర్థము
ఇమ్మహి రామమ్మయనెడి రమణికి జెందున్
కమ్మని నోముల ఫలమగు
ముమ్మిడివర బాలయోగి ముద్దుగ గనియెన్.

6. 'లీలయె' మానవరూపము
'లీలయె' ఘన మాల కులమునందు ధ్రువమున్
'లీలయె' గోవుల గాచుట
'లీలయె' నీ చరిత మెల్ల నిజముగదంఁడ్రీ

7. పాడెను నీకై జోలలు
వేడెను నీ క్షేమమరయ వేల్పుల నెల్లన్
లేడని పించెను జగతిని
నీడై నిను మించువాడు నాడున్ నేడున్

8. నీపసి ప్రాయమునందున
తాపసివౌ రీతులన్నిదాపలికె తగన్
దా పసడి పల్కు లమ్మయె
రూపసి, ఘనసద్గుణంబుల 'రామమ్మ'యిలన్

9. బుడి బుడి నడకల నటునిటు
వడి వడి నడువంగనేర్తువరయంగ యిలన్
చిడిముడి పొందెడిజనులను
పడిబడి కావంగ వలసెప్రస్తుతయుగమున్

10. నడువగ నేర్తురు నందరు
నడచుటలో మేల్మినడకనేర్వగవలయున్
నడచితివీ పుడమినిమేల్
నడకలు కలకాలముండునట్టుల యోగీ

11. వేసిన యడుగున ధర్మము
రాశులుగా బెరుగవలయురయమున జగతిన్
వేషము, మోసము కూడదు
దోసము యిసుమంత లేని దైవమునీవే

12. నిండెను పంచవర్షములు
నిండెను పల్కుల నవ్యరత్నముల్
నిండగు ముచ్చట రూపము
పండా, యని పిలుచు కొనగ బులకలు వొడుమన్

13. చదువను వేయరు నిన్నును
చదువుల బడిచెంతకైన జేరనినీకున్
చదువుల సారము దెలిసెను
జదివితివే జన్మమందు జ్ఞానపుజదువుల్ ?

14. నుడివెనుబ్రహలాదుండల
కడవరకుం జదివె శాస్త్రకోటల ననుచున్
నుడివితి వేమియుజదువక
పుడమిని మోక్షంబు పొందుపోకడలెల్లన్

15. మున్నేజదువున బొందిరి
తిన్నడు, కరి, సాలెబుర్వ్యదివ్యపుమోక్షం
బెన్నగ మీ వంశావళి
సన్నుతమౌ 'భక్తి' విద్య చదువుగమారున్

16. గోవులకాపరి వైతివి
కావుము మమ్మనెడి భక్తకోటుల నెల్లన్
గోవుల గాచెడి రీతిని
కావగ నేర్చితివి మిగుల కరుణన్ జగతిన్.

17. రక్షింపను సజ్జనులను
శిక్షింపగ జెడ్డవారి, క్షితిదర్మమునున్
రక్షణజేయుట కొరకై
నిశ్చయముగ నుద్భవింతు విల నీవెపుడున్

18. తీరుగ తీరిచి నుడివితి
వీరీతిగ నడువుడనుచు విబుధులనెల్లన్
నారీతి నడుచు జనములు
పరమాత్మను జేరు, మోక్షపదవిన్ బొందున్

## ఉపదేశములు

19. సర్వము నిండిన ప్రభువగు
సర్వేశ్వరు గానవిపిన స్థలములకేగన్
సర్వము కాదిది, ప్రశాంత
సర్వముకొరకేగ వలయు సత్యము జగతిన్

20. నుడివితి వుపదేశంబుల
నడువండీరీతినెల్ల వారలు ననుచున్
కడుమూర్ఖ జనాలికైనను
వడిదెలియగ మేల్మిభాషవాడితి విలలోన్

21. ఉపదేశంబులు కావవి
ఉపనిష్త్సారంబు లుర్విలనదగువానిన్
ఉపయోగించెడి జనులకు
ఉపమానములేని దివ్యధామంబొసగున్

22. అష్టాదశమార్గంబుల
శిష్టంబౌతత్వ మెల్లక్షితి దెలియంగా
స్పష్టము జేసితి వెంతయు
సృష్టిని తరియింపమిగుల క్షేమంబొందన్

23. దర్శించినంత తోడనె
హర్షంబుగ సర్వబాపనిహతులు నెల్లన్
ఘర్షణ లేకయె తొలగును
హర్షముగద భక్తకోటి దర్శన మిలలోన్

24. పట్టుదల సడలకుండగ
నిష్ఠయు నీమంబుతోడనిప్పటినుండిన్
గుట్టుగ దైవము దలచిన
గట్టెంగ పైమెట్టు జేర గలుగుదు రవనిన్.

25. పదునాలుగు తరములు ఘన
ముక్తింబడయంగవచ్చు ముదమార మహా
భక్తుండు మోక్ష మందిన
సత్యంబిది సర్వలోక సంచయమందున్.

26. పుట్టుక గిట్టుక యెన్నడు
సృష్టినిలేనట్టి జన్మరహితున కెపుడున్
స్పష్టమగు మహాస్వర్గము
కష్టముగాకుండ, శాశ్వతంబుగ బొందున్.

27. శాశ్వతమా ? తనువులు నిల
శాశ్వతమా ? ధనము ధరను శాశ్వతమేదీ
శాశ్వతమా ? భూసంపద
శాశ్వతమా ? క్రియకు నివి యశాశ్వతమెపుడున్.

28. నీ దది, నా దిది యనుచును
వాదులు వాకొనుటక్రియకు వ్యర్థము కాదే ?
నీదియు నాదియు కాదిది
నా దేవుని సర్వమయుని నిత్యుని దంతన్

29. భానుండొక్కడె యిలలో
తానుండెను దివ్యతేజ తతులన్, గానన్
ఘనకోటి భానులి డగు
నానీశ్వరుతేజమెంతొ నెన్నగ దుగునే.

30. జగమున గల జనములకే
అగణితమౌ తెలివితేటలధికంబౌగా
భగవానుడు జగధీశుకు
తగనెంతటి తెలివిగలదొ తెలియగతరమా ?

31. జనకుడు గద భగవానుడు
మనకెల్లర కితరులెవరు మహిలోగలరా ?
అనవరత మా మహాత్ముని,
ఘనముగ పూజింపకుండ గడిపెదమేలా ?

32. అన్నలు మరియును తమ్ములు
యెన్నగ మరి తల్లితండ్రులెల్లరు "మాయె"
తిన్నగ మదిలో నరసిన
ఉన్నది నిజమైన తండ్రి నీశ్వరుడొకడే.

33. మనకనులకు గనుపింపని
యానీశునిగాననిచ్చయెదగల దేనిన్
ఘనమగు బాధలగెలిచియు
మన నాత్మలోజీవాత్మను మరి తెలియవలెన్.

34. నిత్యుడు, శాంతు, డనంతు, డ
సత్యంబౌ తనువు కొరక శాంతంబేల ?
నిత్యము బన్నములేకను
పత్యంబౌ "కూడు" గూడ పది వేలదియే !

35. జీవుడు భగవత్స్వరూప
మవు, దానిని పంచభూత మశ్రాంతముగన్
భువి లాగుచుండుమాయకు
యివి యెల్ల నెరుగ వలయు యీ జగతినరుల్.

36. 'తా నెవ్వరో' తానెరిగియు
తన చలనము బొందుమనసు దాక్రమరీతిన్
ఘనముగ కట్టడి బెట్టిన
మనకిక బని లేదు గురుని మంత్రముల తోన్.

37. గురువుగ మారును మనలో
చరియించెడి "ఆత్మ" దాని సక్రమరీతిన్
ఆరయ పవిత్ర మొనర్చిన
సరియగు జీవాత్మ మనకు సర్వము తెలుపున్.

38. ఆహారపు సేవనమే
మహి నింద్రియములకెల్ల మరి బలమొసగున్
ఇహ నింద్రియముల కట్టడి
ఆహారపు నాస్తివలన అవనిన్ కలుగున్.

39. దానన్ భూతములైదును
లీనంబౌ ఆత్మయందు నెరుకేలేదు
యన్నండెరు కేలేదో
మన కాహారవసరంబు మరిలేదుయిలన్.

40. జీవాత్మయందు వలనను
పావన పరమాత్మయందు భద్రముగానున్
కేవల మైక్యంబగుటకు
దావలసిన దారిజూప దద్దయు కలుగున్.

41. ఆహారము సేవించుచు
ఇహలోకమునందు తపముయింపుగ జేయన్
మహనీయంబగు బాధలు
మహిలో కలుగంగ వచ్చు మరికనుగొనగాన్.

42. సంసారము నందుండియు
వంశముగల చక్రవర్తి వరతనమందున్
నిస్సాంశయముగ దేవుని
సంస్మరణము చేయవచ్చు "సరిగాదవనిన్"

43. నిలకడ కలుగదు స్మరణకు
చలనంబే తెంచుచుండు జగతిన్ మరియున్
తలపగ నొక్కక్కప్పుడు
బలమగు కష్టములు మరియు బాధలు బొందున్.

44. బాధల జయమున్ బొందిన
మోదంబౌ భగవంతునకు మెండుగకలుగున్
వాదము లేనిది జాలియు
సాదన మొనర్పగా వలె సరియగురీతిన్.

45. భగవంతుడు తలచినచో
తగనందరు మంచి వారెతలపగ నగుగా !
యీ గతినగుదురు నందరు
జగతిన్ యీ సృష్టియెట్లు జరుగగవలయున్.

46. భగవానుడు దయతలచిన
తగనీయగవచ్చు "ముక్తి" తెరువదిగాదు
అగణితముక్తి కిమార్గము
నాగతి వెదుకంగ వలయు నెవరికివారే

47. ఒకరికి నొక్కరు-యేమియు
సకలంబౌ తెరువు జూప జాలరుజగతిన్
ఒకరొకరి పుణ్య ఫలంబున
అకలంకుని అనుగ్రహంబు అమరగగలుగున్.

48. యోగీశు నామస్మరణము
యోగీశుని పాద సేవయెల్లన్ జగతిన్
యోగీశుభజన నిరతము
యోగమునందుండ జేయుయెన్నగ నరులన్.

49. అపరాధంబులు గలిగిన
కృపకలుగదు దేవదేవుకూరిమితోడన్
తపసును నర్పణ జేసిన
కృపగలుగును వారిపైన గణనీయముగాన్.

50. పుట్టుక కెక్కువ తక్కువ
సృష్టిని బేధంబు లేదు చూడగతనువుల్
మట్టిని గలియుటతథ్యము
"పట్టంబౌ మక్తి" నీశు పూజలు సలుపన్.

51. తపమును చేయంగావలె
కృపనీశుని దర్శనంబు కనుగొనువరకున్
ఛపలము కలిగిన తపముకు
ఉపయోగము లేక యంతవృధయగు గానన్.

52. ఐనను దానికి లాభము
పై జన్మకు కలిసివచ్చు ఫలమున్ కలుగున్
కైవల్య ప్రాప్తికొరకును
దైవంబును మరువరాదు ధారుణిలోనన్.

53. పొందగ వచ్చును తపమున
పొందికగా చక్రవర్తి పూజార్హతలున్
అందున గర్వముగలుగును
క్రిందకు జన్మంబుబోవు కీడున్ గలుగున్.

54. సర్వము ఒకచో కానగ
దూర్వారంబగుతపంబె ధారుణిలోనన్
సర్వమగు శరణు జనులకు
గర్వంబౌ మాట వలన గనరాదేమిన్.

55. తల్లియు తండ్రియు భార్యయు
పిల్లలు మీ బాప మెల్ల పంచుకొనగరా
రెల్లర కొరకై బాపము
లెల్లెను చేయంగ దగునె యిలలో మీకున్ ?

56. కృపతో నొసగితి వీధర
చపలంబౌ మనసు గెల్చి సృష్టి తరింపన్
ఉపదేశంబులు పదియును
సఫలంబౌ యెన్మిదిలను శ్రేష్ఠముగానున్

## ఉపదేశములు సమాప్తము

57. సూటిగ గాంచితి బ్రహ్మము
పాటవ మౌరీతి ప్రజలు పరమున్ జేరన్
నీటుగ తీర్చిన నుడుపులు
నేటికి యేనాటికైన నిండుగ నిలుచున్.

58. శమ, దమ, షట్కములన్నియు
రమణీయముగాగ నిన్ను రయమున జేరన్
కమనీయ మహిమ యొప్పగ
సమధానంబొందు పడెను సంస్తుతిజేయన్.

## శమాదిషట్క(6) సంపత్తి :-

1. శమము = మనసు నిగ్రహించుట
2. ధమము = ఇంద్రియ నిగ్రహము
3. ఉపరతి = బ్రహ్మ విషయములందు దప్ప, అన్య విషయములందు సంకల్పములు లేకుండుట
4. శ్రద్ధ = వేదాంత గురువాక్యములందు శ్రద్ధ ఉంచుట.
5. తితిక్ష = శాస్త్రవిచారైక పరాయుణుడై, శీతోష్ణాదులను లక్ష్యముచేయుకుండుట.
6. సమాధానము = సర్వసంకల్పములను విడిచి మనస్సును బ్రహ్మమునందే నిలిపి శాంతిని బొందుట.

59. ముక్తింజెందుట తథ్యము
నిత్యమునిను గొలుచు జనులునిజముగ ధరణిన్
సత్యము, శౌచము, శాంతము
భక్తులకుంగలుగు మిగుల భాగ్యంబొప్పన్.

60. జ్యోతివినీవై వెలసితి,
ఖ్యాతిగ యీ జగతినెపుడు కాంతులు వెలయన్
దాతవు ధాత్రిన్ జనులకు
నేతవు ఘనముక్తి నీయనేర్పరినీవే.

61. కాంతులు నీపైక్రమ్మను
శాంతబౌనీదు మహిమ జెలువారంగా
బ్రాంతులు నీదరి జేరవు
చింతనకున్ అందరాని స్వామివినీవే.

62. చిత్కళల దర్శనంబును
సత్కృపతో నొసగుదీవు సజ్జనములకున్
తత్కృప బడసిన వారలు
చిత్కమలము నందుశాంతి జెందుదు రవనిన్.

63. సిద్ధులు నీ కొన గూడెను
శుద్ధంబౌ మోక్ష పదవి జేరుటకొరకై
తద్దయు మాకున్ తొలగెను
ఉద్ధృత మాకర్మచయము ఉన్నతి చెందన్.

64. అనాదియగు నా మాయను
ఘననిద్దుర జెందునట్టి గుణుడగు జీవున్
కనమేలు కొల్ప మిగులన్
మననంబౌ పరమ పదము మరినీకబ్బెన్.

65. హరియును, హరుడవునీవై
దరిజేరెడి భక్తులకును దయతోనెపుడున్
వరముక్తినొసగు చుందువు
దరముమ్మిడి వరనివాసదయగలయోగీ

66. సరి నీకెవ్వరు జగతిని
మురిపెముగా కూడు నీళ్ళు ముట్టకనుండన్
తరమా ? నింకొక రెవరికో
హరికిన్నీడైన నీకు అల్పముగాదే ?

67. సిరితల్లి పరమపాదము
లుర్విన్ శ్రీస్వామి నాయనామా ఖ్యలకున్
దర్శన మిప్పించుటయన
అరయంగా చెల్లునీకు నొకరికి తరమే ?

68. పొగబారులు ధ్వవించెను
సౌగంధములెల్ల యెడలసొగసుగ జెలగెన్
అగణితఘంటానాథము
తగనెవ్వరొనర్చినారొ ? తెలియగ తరమా !

69. మందిరమందున జెలగెను
సుందరమౌ వెలుగు తతులు చోద్యము వెలయన్
సందర్శించిరి ధన్యులు
డెందంబులు ముదము వొందధన్యతజెందన్.

70. సందేహమేమి నీదగు
సుందర పాదారవిందసుమముల గొలువన్
మందుండైనను బొందును
బంధము లేనట్టి ముక్తి పదవిన్‌జగతిన్.

71. కలిమిన్ గోరను, నీతో
చెలిమిని వాంఛింతుమదిని చెలువారంగా
ఫలితము నాదగుఫలమే
లలితంబౌ నీదుస్మరణ నిరతముజేతున్.

72. సరిరారు సర్వజగముల
హరినామస్మరణ సలుపుయతిగణములు నీ
సరినీవె సరియు ననుచును
మరిమరి వేడుదును మిగులమురియుచు స్వామీ.

73. 'మాలవు' గోపాలునిమెడ
'మాలవు' ఘనముక్తి కాంత ముదమగు జడలోన్
'మాలవు' ధారుణి యతుల, సు
మాలగ నీ కీర్తి మిగుల మహిలో జెలగెన్.

74. శరణంటిని యోగీశ్వర
శరణంటిని నీదు పరమ చరణద్వయమున్
శరణంటిని మౌనీశ్వర
శరణంటిని శరణుశరణు జగతిన్ నిన్నున్.

75. కారణజన్మము నీయది
కోరిన ముక్తినిచ్చు ఘనుడవు గాదే
ధారుణి నీ సరిలేరని
చేరితి నీ చరణయుగళ సన్నిధి స్వామీ.

76. సాధ్యమ బోనము మానుట ?
సాధ్యమ యిల జలము గొనక జీవించుటయున్
వేద్యులె మును పెవ్వారును ?
చోద్యముగద ధరణి నీదు చరితం బెల్లన్.

77. ఫాలాక్షు దివ్యరూపము ?
శ్రీలక్ష్మీధవుని మహిమ జెలువారంగా
యిల నీకబ్బెను ఘనముగ
బోగుడునె యిల భక్తకోటి బృందమునిన్నున్.

78. సురగణములెల్ల మెచ్చెడి
చిరు పాదముక్రింద మిగుల చెలువము మీరన్
గరికిగ మొలచిన జాలును
దారుణినాజన్మమిగుల ధన్యతగాంచున్.

79. కోరెద నీతో కూరిమి
కోరెద నీ పైన భక్తి కొదువేలేకన్
కోరెద మక్తికి శక్తియు
కోరెద నీ ధ్యానమవని కోకొల్లలుగన్.

80. వదలను నీ పద కమలము
వదలను నీ భక్త కోటివినయపు మైత్రిన్
వదలను భవహర నామము
వదలను యెదలోన నీదు వరరూపమునున్.

81. తిరుమణి వైతివి నుదటను
స్థిరముగ నిను దాల్చి శిరము సుగతిన్ బొందెన్
వరభస్మరేఖ నగుదును
ధర నా పాపములు బాయ దయ నీసేవన్.

82. మూలము జగతికి నీవై
మూలాధారంబ విద్య మురియుచు జగతిన్
మూలము నెరుగగదెలిపిన
మూలపు బురుషుండ వీవు మునిజగధీశా.

83. పదునాలు యేండ్ల ప్రాయము
పదుగురతో నాటలాడిపాడెడి కాలం
బుద్ధింధిరిగెను దబసికి
సిద్ధుడవై జగతి మిగుల సుధలన్ గురియన్.

84. నరజన్మకు పరమావధి
పరబ్రహ్మము గాంచి భవముపృధివిన్ లేకన్
తరియించు జ్ఞానమొందుట
ధరణిలో నీసరిని మించు ధన్యులు గలరే.

85. సత్యము సుగతికి మార్గము
సత్యంబే ప్రాణికోటి శ్రేయము మిగులన్
సత్యము నుడివెదనేనిల
సత్యపు అవతారమూర్తి జగతిన్ నీవే.

86. మది నీకర్పణ చేసిన
పృధివిన్ ఘనఫలము మిగుల బొందగవచ్చున్
వాదములన్నియు నేలా ?
మేధిని నీ పూజముక్తి మార్గము మాకున్.

87. గోపాలుడు నీ పాలిటి
కల్పకమై నిల్చినిన్ను ఘనునిన్ జేసెన్
మాపాలి నీవేదైవము
పాపాలను బాపి మమ్ము బ్రోవుము స్వామీ.

88. యేడుగడ నీవే మాకని
వేడెద మము కరుణజూడ వేగమెరమ్మా
పాడెద నీపై కందము
తోడుగ మా బ్రతుకు నావ ద్రోవుము స్వామీ.

89. తలపున నిన్నే సతతము
చలనంబేమియు లేక స్థిరమగురీతిన్
దలచెద ఘన నీనామము
యిల నా పాపములు బాపవలయును స్వామీ.

90. మధురము నీదగు నామము
పృధివిన్ నిను గొల్చు వారు పుణ్యపు జనులే !
"నిధి" నీ నామము ముక్తికి
బృధజన సేవ్యంబు నీదు పదములు జగతిన్.

91. సర్వము నిండిన ప్రభుడవు
ఉర్విని నీ మహిమ దెలియ నెవరికి తరమౌ
పర్వము నీ అవతారము
దుర్విధి దాటంగ మాకు దైవం బొసగెన్.

92. భానుని కిరణము లందున
లీనంబై నీదు కరుణనిరతము జగతిన్
ఘనముగ భక్తుల బ్రోచును
అనఘా ! నీసరినిబోలు యతులున్ గలరే !

93. కాషాయవస్త్ర ధారణ
లేశంబేమియును లేదు నిజకరములలో
భాసపు జపమాలైనను
వాసిగ లేనట్టెయతివి వరమౌనీంద్రా !

94. కోట్పల్లి వంశనామము
బటుతరమౌ పోతరాజు వరనామంబున్
యెటులన్ బ్రోచెదొదీనుని
గట్టుంబడియుందు నీదు పదదాసునిగన్.

95. జనకుండార్యుడు నూకయ
జననీ ఘన వేంకమాంబసుతుడన్ భృతుడన్
జనపథము విశాఖనగరము
ఘనముగ నివాసముంటి ఘనబుధులలరన్.

96. మంగళ ముర్వినిజనులకు
మంగళమౌ స్వామి భక్త కోటులకెల్లన్
మంగళము బాలయోగికి
మంగళ మహత్తనుచు మదినిన్ దలతున్.

ఓమ్ శాంతి శాంతి శాంతిః

ఓమ్ తత్ సత్

హరిః ఓమ్

## నమో భగవతే బాలయోగీశాయః

1. శ్రీ గణపతి, శ్రీవాణిన్
శ్రేయంబులు గురియమిగుల క్షేమంబొసగన్
శుభములు కలుగగనామది
కొనియాడెద కావ్యరచన కొనసాగింపన్

2. సీసముల్ వ్రాయబూనెద చేవమీర
మానసంబున భావముల్ ముసురుకొనగ
దేవగణములు మురిసినన్ దీవింపరాగ
జతన మొనరింతు జగము జేజేలు వలుక

3. సీ॥ ఆకలీ ! యేది నీ చిరునామమెక్కడ ?
బాలమునిచంద్రుడిచ్చట ప్రాభవించె
దాహమా ! యేది నీ దారి చూపుము నాకు ?
నిర్జలధారుండు నిచటనుండె
నిద్దురా ! ఏదినీ యుద్ధరింపెచ్చట ?
మునిరాజుకడనా నీ మొద్దురూపంబు
బద్ధకంబేది నీ బుద్ధిలేని జాడ ?
ఘనయోగి కడనొ నీ గాండిరింపు

తే॥ పాండు పొలిమేరదాట మీ పురమునకును
ఉం డవలదిచట నోఘడియయైన
"పండు"వర్ణుండు దేవుడు బాలయోగి
నిండుతపమున గూర్చుండెనిర్మలముగ.

4. సీ॥ గోదారి జలమున గోవిందు నామముతో
పుణ్య స్నానముజేసె పొలుపుమీర
నారికేల వనము నందొక్క వృక్షంబు
క్రిందను గూర్చుండికనులు మూసి
దేవదేవుని మదిని దివ్యముగ ధ్యానించి
తపసు ప్రారంబించె తన్మయముగ
లేదుదేహచింత లవలేశమైనను
యోగమున లీనమై యలరుచుండె

తే॥ నట్టిబాలుండు నవనీత చోరుమదిని
గట్టిగా బంధించి పట్టుబట్టి
మనసునాత్మను జొనిపె మరి కదలనీయక
వెన్ను భక్తుడాయె వేడుకలర

5. గుప్పుమనియెను కపురంపు కలికవోలె
ఆకసముదాటి ఆవని అంచువరకు
బాలుజూతమ రారండి భక్తుడంట
ఆశన మేమియు గొనని నిరాహరుడంట

గాఢ తపమున గూర్చొండెకదలకుండ
దివ్య కీర్తికి ఘనుడైన ధృవుని వోలె
నీరుగోనడంట మరణంపు భయములేదు
చిరుత ప్రాయంబున హరినామచింతనంబె

గీ॥ బాలుడీతండుగోపాలబాలసముడు
సందకిశోరుకీడైన వాడు సుండు
కాంచినంతనె కనులకు కరువుతీరు
నంచు కదిలెను "ప్రజా"రణ్యమాయె.

5. సీ॥ కలదుముమ్మిడి వరంబున కాసారమొకటి
పోలమాంబచెరువని పిలుచుచుండు
మున్నూటయారువదియైదు దినంబులు
జలపూర్ణరాశియై జెలగుచుండు
నిండుటయెగాని ఎండుటెప్పుడులేదు
శతశతాబ్దంబుల చరితలోన
నడిమి వేసవినైన నిండైన గంగతో
ముదము గూర్చునుమిగుల మోదమరల

తే॥ నట్టిజలపూర్ణ రాశియువట్టిపోయె
చుక్క నీరును మిగులజాలదయ్యె
పీల్చివైచిరి జలరాశి "భక్తరాశి"
చోద్యమందగ జగంబున జనములెల్ల

7. సీ॥ చిల్లిగవ్వయు నీదు చేతనుండని నీకు
ప్రాకారకుడ్యంబులెట్లవచ్చె ?
తపముజేసుకొనగతగనొక్కమందిరము
ధర్శనమండపందాని కవల
నారికేలవనము నలుదిశల ఆశ్రమము
శాంతి గూర్చుచుండ చిత్తమలర
ఇంద్రవైభవంబు సరిబోలు సన్నిధి
ఎట్లు సమకూడెనెరుగగనెవరి వశము ?

తే॥ ఘనులగణ్యులు మిగులనెందరో శ్రమయించి
నీదు తపంబవిఘ్నంబుగాగ
బవలు రేయి బరిచర్య బాగుగానొనరించి
తరియించిరెందరో ధన్యులైరి.

8. సీ॥ పూవులందున గూడ బ్రాణముండును సుమీ
మందిరంబున బూలు త్రుంచవలదు
జలపోషణంబిడి సౌమ్యముగ పోషించి
బెంచవలయును బూలమొక్కలెల్ల
దనుమాడగారాదు నారికేలంబుల
సహజముగ భూమిపై చేరవలయు
మందిరంబున మిగుల మాట్లాడగరాదు
నిశ్శబ్దనియమమును నెరుపవలయు

తే॥ పాదరక్షలు విడిచి బోవచ్చుచక్కగా
మందిరాం తరమునకు ముదము మీర
దైవ ఆజ్ఞకు సమము నీదవ్య ఆజ్ఞయు
పాటించి సేవించి బుణ్యులైరి.

9. సీ॥ పావనగోదారి పరిశుభ్ర తోయముల్
ముదిపెముగ నిను తాకిమోదమందె
సౌమ్యయుత సందోహశీతలవాయువుల్
నిను జేరిధన్యతనిలుపు కొనియె
ఉద్దండ ప్రాభవములొలికించు భాస్కరుడు
నీ మేనుసోయగము నింపుగూర్చె
నిన్ను తాకిన యంత నిలువెల్ల పులకించి
భూదేవి మోదమున పొంగిపోయె

తే॥ పంచభూతములలో ప్రవహించునీ మహిమ
కనులార వీక్షించి ఘనత జెందె
దివ్యంపు సీమయై ధారుణి వర్ధిల్లె
కమనీయ ఘనసీమ కోనసీమ.

10. సీ॥ పండ్లెన్నియో కలవు పలుతీపి రకములు
పండ్లలో ఘనమైన "పండు"నీవు
కాయలెన్నయొ కలవు కమనీయ రకములు
కాయమే రసపూర్ణ "కాయ" నీవు

పూవులెన్నియొగలవు పూర్ణగంధంబులై
పూవులందున అమర పుష్పమీవు
ఆకులెన్నియొ కలవు ఆహ్లాదకరములై
ఆకులందున దివ్యపత్రమీవు

తే॥ కోనసీమను వెలసిన కోటికోట్ల
ఫలములందున పుణ్యంపు ఫలమునీవు
రసరమ్య నిధియైన రతన మీవు
కమనీయ స్థవనీయ దైవమీవు.

11. సీ॥ అవనియందున నీకు ఆహారమగుటకై
కదలివచ్చెను మధుర "కదలి"వనము
రసాల రమ్యయుత రమణీయ తములునై
మామిడి వనంబులు ముందుకురికె
నారికేళంబులు నవనీతసమములై
ఆహారమిడ నీకు అరుగుదెంచె
పావని పరిపక్వ పనసఫలంబులు
నీ భోజనమునకై నిలువబడియె.

గీ॥ ధౌతదేను మాతలగణంబులై నీకు
క్షీరమిడగనెంచి చేరవచ్చె
ఆహారమవుసరము అసలేమిటని నీవు
నియమమూరగ నిరాహారివైతి.

## నమో భగవతే బాలయోగీశాయః

## బ్రహ్మా విజ్ఞాని భగవాన్ బాలయోగీ స్తుతి శతము

1. శ్రీ శివ పార్వతీ తనయు శ్రీ గణేశు
భారతీ మాత చదువుల భాగ్యధాత
శారదా సతిని మిగుల సంస్మరించి
కోరిక వీడేర మ్రొక్కి కడుస్తుతియింతున్ ?

2. "ఆశ" కుత్తుకబట్టి ఆవలకు ద్రోచి
"మోహ"మను దాని మొదటికి మట్టుబెట్టి
నిత్యమౌ పదవినందున నిలువగలిగె
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగీ.

3. నిర్మలంబైన మనసును నేర్పుమీర
వైరాగ్య భాగ్యమందున వశముజేయ
"దేవు" డే దేశమందున దాగియుండు ?
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

4. పంకమందున బుట్టును పద్మమెపుడు
రాళ్ళమద్యను రాయియై రత్నముండు
మనుజులందున గలరెంతొ మంచివారు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

5. అంతరిక్ష మందు ఆకాశనౌకలో
గ్రహము ల్లెలను జేర గలుగవచ్చు
దివ్యపథమును జేర త్రోవ నీమార్గమ్ము
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

6. "నారాయణు"ండొకట నరుడుగా జనియించు
నరుడు తపమున నౌ నారాయణుండు
నరులలోన నీవు నారాయణుండవు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

7. దయకు రూపంబు వెన్నల ధరణిలోన
ప్రేమయనుదాని రూపంబు పూలతావి
దయకు ప్రేమకు నీ రూపు దివ్యగుర్తు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

8. పునర్జన్మంబన్న పుట్టుటయని గాదు
జ్ఞానోదయంబున ఘనుడునౌట
జన్మమర్మల నెరుగు జోదువునీవయా
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

9. రాజ్యమేలగవచ్చు రమణీయప్రభతోడ
దానివలన కలుగు దుర్గుణంబు
దుర్గుణంబున జీవి దుర్గతి బొందును
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

10. పల్లవంబులదళుకొత్తు ప్రభలనెన్నొ
నీదు పదములనిత్య నివాళులొసగు
నట్టి, పాదపూజ నాకొసగు నిరతంబు
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి.

11. ధర్మశాస్త్రము తెల్పు దారులెన్నొయున్న
ఖర్మననుసరించు కడకుజీవి
పాపపుణ్యఫలము ఫలితమే ఖర్మంబు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

12. పరమశ్రేష్ఠము నెంతయో పావనమ్ము
సర్వ దోషహరము శ్రావ్యతమము
మహిని నీనామమే మాకు మంత్రమయ్యె
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

13. మానసంబున నిన్ను మరవకదలచిన
మహిలోన నీదగు మహిమ దెలియు
ముక్తి నొసగ గల్గు శక్తివంతుడవీవు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

14. శిల్పి నీవు చిన్న శిలను మాత్రము నేను
తీర్చిదిద్ది మేలి తీరునిమ్మ
నీదు దయను గొన్న నిత్య కైవల్యంబె
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

15. దివ్యపథమునీయ దిక్కు నీవని నమ్మి
మానసంబున నిన్ను మరువకెపుడు
పలువిధంబుల దలచి ప్రార్థించు నామది
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి.

16. సర్వబాప హరముసంతత మోదమ్ము
నిరుప మానంబైన నీదునామం
బెవ్వరు దలతురో యవని ధన్యులు వారు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

17. నేత్రయుగళంబును నియమార మూసెదు
వఖిలవీక్షణంబు యగును గాదె
నీదు చల్లని చూపు నాపైని దయజూపు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

18. నిన్ను జూచెడి చూడ్కు నిరుపమానంబౌను
కన్నుదోయి కితర కాన్క లేల
పరమ పుణ్యపురుష పాలించు మొరవిని
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

19. సాదుజనముల తోడ సంతతంబును చెలిమి
సత్యవచనంబు మిగుల శౌచనంబు
నీదు కరుణ బడయ నివి చాలముఖ్యంబు
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి.

20. నీదు సేవలోన నిత్యంబు గడిపిన
లేదు "కాలు" భయము లేశమంత
మాదుపుణ్య ఫలము మరినీదు ధ్యానమె
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

21. విశ్వమందు నిన్ను వీక్షించుటే చాలు
సర్వ బాపతతులు సమసిపోవు
మాదు పుణ్యఫలము మరినీదు సేవయె
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి

22. కరుణ జూడుము తండ్రి కమలాక్షయోవరద
శరణు జొచ్చితి నీదు చరణములకు
ధరణిని నిన్నుమించు దైవంబుమరిలేరు
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి.

23. సత్యమనెడు రథము చక్కగా నెక్కియు
దర్మమనియెడి దివ్య దారిలోన
సాగిన చాలునీ సద్దర్శనంబౌను
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

24. కోటి విద్యలునేర్చు కూటికొరకే నంట
కూడు జానెడు పొట్ట కోసమంట
కూటి కూటిలోన కోట్లైతివి మంటిని
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

25. తత్త్వమంత వెదకి తానెచట గలడని
చిత్తమందు మిగుల చింత జేయ
నిరుపమానపుస్వామి నీరూపుగననయ్యె
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

26. గుప్త మార్గముకాదు గురుదేవులే వద్దు
నీదునామ మరయ నిజముదేవ
జగతి నీ నామంబు జయకేతనంబయ్యె
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

27. మానసవీణను మ్రోయింతు "మోహన"లొ
వాయించు "మాది"లో ఘనవాద్యమొకటి
జగతి జనములు మధుర చోద్యముల జెందగ
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

28. కటిక చీకటి దారి కారునల్పును దాట
కాంచనంబును బోలు కాంతిగలదు
కాంతిగడచిన వెనుక కాంతుము నీరూపు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

29. పాలయందు తెలుపు భాసిల్లు చందాన
నీలమందు సొగసు నిలిచినట్లు
నీదు భక్తులకెల్ల నిక్కమౌ మోక్షంబు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

30. పంతగించి మదిని పరికింపగా వలదు
చిత్తశోషణమసలె చేయవలదు
పరమపురుష నిన్ను ప్రార్థించుటే చాలు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

31. నాదు జీవనమ్ము నీదు దీవెనమ్ము
నాదు కాయమౌను నీదు కరుణ
నాదు సర్వస్వమ్ము నీదు ప్రేమకు రూపు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

32. దేహమందు ప్రాణదీపముండినయట్లు
మనసునందున ఆత్మ మసలవలయు,
ఆత్మనిలుపుకొన్న ఆవల నీరూపు
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి

33. సామి సామియనుచు చాలగ నిను నమ్మి
పూజలెన్నో జేతు పొందుగాను
నాదు మదిని కోర్కెనెరవేర్పగావలదె ?
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

34. వనము నందు గజము వడి బ్రాణభీతితో
మాధవా ! కావుమని మొరగు లిడియె
నాదు మొరనువిని నాకోర్కెదీర్పవే
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

35. తనువెల్లకృశియించె దారుణరోగమున
మృత్యుభయముగల్గె మూర్ఛవచ్చె
నీ నామమంత్రమే నా కౌషధంబయ్యె
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి

36. జాడ్యనివృత్తికై భాగ్య నగరమువోవ
కాలు డేగుదెంచెకడు భీకరముగ
నీ నామమంత్రంబె నాదు ఉసురును నిల్పె
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి.

## శ్రీ బాల యోగీంద్ర స్వామి వారి అవతరణ

37. ప్రభల విరజిమ్మెభువిని శ్రీ ప్రమోదూత
కీర్తి కాంతుల వెలిగె శ్రీకార్తికమ్ము
శుద్ధ విదియా గురువార స్వాతి జననం
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

38. సత్య, శివ, సుందరమ్ములు చోద్యమలర
నీదురూపంబు దాలిచినిశ్చయముగ
వరలు చుండెను మేధినీ వలయమందు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి

39. విశ్వమందున శ్రీ కారవిభవమొందె
నీరు నాహారముల యొక్క నవసరంబు
లేక జీవింపగలెడు నేర్పుజూప
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి

40. వత్సరంబుల దశకముల్ వన్నెమీర
తరిగిపోయెను నీధ్యాన దీక్షతోడ
నాదుకాంక్షను తీర్చుము నయముతోడ
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

41. పదియు నారేడుల ప్రాయమందు
ముక్కుపచ్చలు తీరని మేరయందు
భక్తి వైరాగ్యములు నీలో ప్రభవమందె
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి.

42. మనసులోన నీదు మహిమాన్వితంబైన
రూపమొకటనిల్పి రేయిపవలు
దివ్యసంకీర్తనాధీదితులు వెలయింతు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

43. మదిని నినుదలచి కార్యంబు మొదలువెట్ట
జంకులేకుండ విజయంబు జరిగితీరు
జ్ఞాన బ్రహ్మవు నిజమైన ఘనుడవీవు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

44. ధరనుబదివేల జన్మలు దాల్చియైన
నిన్నుబోలెడి దివ్యుని నెరుగగలమె
మనుజ జన్మంబున మరి "మాల"వైతివి
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

45. నిత్యము నియమార నినుగొల్చు నరులకు
ఆత్మశుద్ధి కలుగు అద్భుతముగ
మహిలోని మనుజులు మహిమాన్వితులౌను
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

46. దివ్యమగు పాదారవింద ద్వయమునకును
విమలమౌ నీదు వీక్షణ ద్వయమునకును
వేనవేలుగ నమస్కృతుల ద్వయములిడుదు
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి.

47. శక్తికొలదిగ నీపాద సేవజేసి
భక్తి తోడుత నీ నామ భజనచేసి
కొలుచువాడు మిగుల కోవిదుండౌగదా !
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

48. ఉన్నవాడు కాదు ? ఉర్విలోయున్నతుడు
భక్తిశ్రద్ధలు గలుగు భక్తుడెంతొ
ఉన్నవాడు మిగుల ఉద్దండుడతడెంతొ
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

49. దండకారణ్యపుమండుటెండలలోన
అతిశీతలాచలపు హిమనగములోన
క్లేశమింతయు లేక నీదయను మనవచ్చు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

50. పద్మనాభుని పాదమ్ముపూజచేసి
సత్యదేవుని ఆత్మలో స్మరణచేసి
ముక్తిపొందగవలయు మనుజుడెపుడు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

51. పరగడ ముఱగడ బిరబిర
పడతిరిగెడుపంది గూడపరహితమునకై
జీవించును, మనుజుడేలఝుడుడయ్యేయిలన్?
బ్రహ్మ విజ్ఞాని భగవాన్ బాలయోగి.

52. కావు కావుమనుచు కేక విడుకాకియు
తోడి వారల బిలుచు తినగరాగ
మనుజుడేల పుడమిమరెభ్రష్టుడాయెను ?
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

53. కాకి, పందికన్నకడుహీనమా ? జనము
మంచి తెలిసి ప్రజలు మసలుకోరేల !
ధర్మమెరుగువారు ధన్యులు యిలలోన
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

54. ధర్మమనుచు కొంత దానంబుచేయుము
ఉన్నదంత ఊడ్చి వదలరాదు
సభ్యతెరిగి బ్రతుకు సజ్జనుడిలలోన
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

56. జన్మమన్నిటిలోన నరజన్మముత్తమట
జనులకేల యిలనుజాలిలేమి ?
జాలిమించినరులు జోలెపట్టగవలదు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

56. ఉండబోరునరులు మున్నూరుయేండులు
ఉండబోవు సిరులు మెండుగాను
ఉండువరకు నరుడునుండవలె ప్రేమతో
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

57. ప్రేమయన్నది మిగులపెన్నిధి నరులకు
ప్రేమతోడ జనులు బెరుగ వలయు
ప్రేమించుటయన్న కామించుటయుగాదు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి

58. కనకుమెప్పుడు కళ్లతో క్రూరఖర్మ
పలుక కెప్పుడు నోటితో పరుషపదము
వినకుమెప్పుడు చెవులతో నింద్యబాష
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

59. సత్యవచనమ్ము సత్కర్మ సత్యచూడ్కి
పథ్యమౌ ప్రజలకెప్పుడు పాడిగాను
నిత్యమాచరించు వారు సజనులౌదురు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలజయోగి.

60. మనసునుంచవలయు మంచిగానెప్పుడు
కాయమాహారసత్వంబు కలుగవలయు
దానగల్గును గాదె ధన్యతధరలోన
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

61. కారుకూతలు వద్దు కీడు తలుపగరాదు
జీవహింసమిగుల చేటుదెచ్చు
ప్రాణికోటియందు పరమేశ్వరుడుగలడు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

62. "మాట" యన్నదియెంతొ మహిమగలిగున్నది
"పలుకు"లోన గలదు ప్రాభవంబు
మాటలేయౌగదా మహిమగల వేదంబు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

63. కామక్రోధములున్న కనులెఱ్ఱబడుచుండు
శాంతవంతుని దృష్టి చల్లగుండు
వసుధరక్షణ చేయువరశాంతవంతుడే
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

64. సర్వప్రాణులు మిగులశాంతులేయైనచో
సృష్టి వైవిధ్యంబు సాగుటెట్లు ?
షడృచులు భువిలోన సౌభాగ్యసంస్కృతి
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

65. మానవీయగుణము మనుజులకు నుండవలె
మనసు ఎదుగుదలకు మార్గమదియె
ఖలులకెప్పుడుగల్గు జ్ఞానోదయంబు ?
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

66. అవనియందు గల్గు అన్నిభోగములును
ధనరాశి సంపదలు దైవంబుకంటె
తృణమకంటెను మిగులతక్కువయైయుండు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

67. "బుద్ధి"శుద్ధము కల్గి బాగుగా నుండిన
"మనసు" దారిజూపు మంచిత్రోవ
"ఆత్మ"పై రెండింటి కరుదైనసాక్ష్యంబు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

68. గుణము మంచిదైనగుణవంతుడౌ నరుడు
గుణముచెడ్డ దైన గుణహీనుడగును
గుణముగణణము జేసిఘనులుగావలె జనులు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

69. దైవాంశ మనిషిలో దాగియున్నది చాల
జాడలెరిగి నరులు జీవించవలయు
త్రోవ లెరుగు వారు దైబంబుతో సమము
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

70. మోదమందునరులు మేధినీ వలయమున
సాధనంబు జేసి చక్కగాను
దైవసాక్షాత్కారంబు దివ్యముగబడసిన
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

71. నేలకొరుగు "రాయి" నేరుగా విసిరిన
పైకి బోవదు దాని పరిధిదాటి
మూర్ఖుకెంత తెలుపమోక్షంబురాబోదు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

72. సర్వేశ్వరుండేల శాంతమౌ మతితోడ
సృష్టికార్యంబును చేయడేల ?
దుష్టులెందరొ మిగులదుర్నీతి చేర్చిరి
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

73. లోకమందున సకలవ్యావహారికులెల్ల
దేవుడా ! నీవెమాదిక్కంచుగొల్తురు
దేవున కేలయీనరులపై ద్వేషంబు ?
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

74. చిక్కుముడులు విప్పిచక్కగా జేయుట
నీవుగాదె తండ్రి నిక్కవముగ
భక్తులందరు నిన్ను బ్రార్థించి వేడుదురు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

75. మనసునందు "చింత" మహినీశ్వరునికొరకె
అన్యచింతలెల్ల ఆవలిడుము
నీదుకోరికతీర్చు నీశ్వరుండెప్పుడు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

76. జన్మజన్మలనీదు చరణారవిందముల
కొలుచువారలు మిగులు గణనచేయ
జ్ఞానదీపంబులౌ విజ్ఞానులేయగును
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

77. పరమపావన నీదు పదములంటినచాలు
పరలోకసౌఖ్యముల్ పొందగల్గు
అంతకన్నను మిగుల ఆశయేమున్నది ?
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

78. "రాత"ను సరిజేసి రమ్యంబు చేయొచ్చు
గీతను సరిజేయు జ్ఞానులెవరు ?
రాతగీతల సృష్టి రాధికాధవునిదే
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

79. మనసు శుద్ధము జేసి మలినములు తొలగింప
ఆత్మనందు చేరి హాయిగొలుపు
సత్కర్మవంతులకు చక్కని మార్గమ్ము
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

80. గమ్యమొక్కటి స్థిరము గాఢముగ జేసిన
దరిజేరగా మనసుదారిజూపు
దారిలోన నరులు తడబడుట తగదెపుడు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

81. చిరునవ్వుమోమున చిందులేయగవలయు
మాటతేనెలూరునటు మలచవలయు
సుగుణ ధాముడు భువిని శ్రీనివాసుండగు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

82. సంతసమ్ము మదిని చాలగనెలకొల్పి
చింతలన్ని విడిచి చెలగవలయు
పంతగించు మనిషి పరమేశుడేమౌను ?
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

83. తోడులేదని నరులు తల్లడిల్లగ వలదు
నీడలేదని జనులు ఏడ్వవలదు
నీడ తోడునిచ్చు దైవంబుగలడయా !
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

84. ఎందుగల డీశ్వరుండని వెదకి వెదకి
పుణ్యతీర్థంబులెన్నియో పోయిజూచు
బొందెకుహరంబులోదాగె పుణ్యమూర్తి
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

85. మధురభాషల నిన్బొగడి మహినినేను
వేడుకొందున మోక్షంబు వేడుకలర
దాత నీవుదేవ దయజూడుభక్తుని
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

86. సాధువర్తనులతో సఖ్యంబునెప్పుడు
చేయువాడు మిగుల సౌఖ్యమొందు
నీదాసదాసులకు నేదండమిడుదును
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

87. కోరికలు మదిలోన కోటి కోటులుండు
మంచి వెంచి తీర్చు మౌనస్వామి
తీరని కోర్కెలకు తగ్గనిందచేవలదు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

88. బాషయెంతొ మిగుల భాసంబుగావలె
దోషముండరాదు తృటియుగూడ
దేవి దేవులెల్ల దీవించిబ్రోతురు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

89. దైవదూషణవలదు దోషంబు మెండగును
సత్యభాషణ మిగులశ్రేయమిచ్చు
కామితంబు మోక్షకామితముగావలె
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

90. కాయంబునకు కీడు కలుగనీయగరాదు
కాయమే దైవంబు కన కాలయమ్ము
సర్వవిధి నిర్వహణచేయునది కాయంబు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

91. సుకుమార దేహమందున శృతినిమించి
వేషదారణ చేయుట వెర్రిగాదె
నిజరూపమున మనిషినిత్య సిద్ధినిబొందు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

92. కామధేనువు మించి కోర్కెలు తీర్చుము
కల్పవృక్షము బోలు ఘనత నొసగు
దేవదేవుల మించుదేవుండు నీవయా
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

93. సత్యహింసల ఘనత చక్కగా దెలిసియు
మనుజుడేల వాని మరతురిలను
సాధ్యమగు మార్గమున చరియింపబూనరు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

94. ప్రొద్దుపొడవకమున్నె నిద్దుర మేల్కొంచి
నియమారగా విధులు నిర్వహించి
స్వామి ! నీపూజను చేయువారలె ఘనులు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

95. పండ్లు బండెడు వద్దు ప్రసాదమొద్దు
పుష్పంబులధికంబు పూజకొద్దు
నిర్మలమౌ భక్తి నీమీద చాలును
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ **బాలయోగి.**

96. నీనామస్మరణంబు నిత్యంబు నా విధి
నీకు మ్రొక్కగహస్తముల్ నేర్పుమీర
ముకులింతు రావేమా మూలవేల్ప
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

97. శరణు శరణంటిని జగదేక మౌనీశ !
ఆత్మబోధన సల్పి ఆదరించు
కృతిని జేసితి నీదు కొలువనందుండంగ
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

98. బ్రహ్మవిజ్ఞానివి బహుజాడలును దెల్పు
అందుకొన్నింటిని ఆదరమున
సత్యబోధనజేసి చక్కగాదరిజేర్చు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

99. తప్పులన్ని నావి ఒప్పులు స్వామివి
ఒప్పులే చేకొనుడు విజ్ఞులార !
దాసుని తప్పులు దండంబుతో సరి
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

100. పోతరాజు నీదు పాదదాసుడు స్మి
సౌభాగ్య సావిత్రి చరణదాసి
విష్ణుబాబునీదు వైశిష్ట్య వైద్యుండు
బ్రహ్మవిజ్ఞాని భగవాన్ బాలయోగి.

**శుభమ్ భూయాత్ సమాప్తము.**

రచయిత



శ్రీ కోటిపల్లి పోతరాజు - శ్రీమతి సావిత్రీదేవి

రచయిత శ్రీ కోటిపల్లి పోతరాజు గారు. వీరు రిటైర్డ్ టీచర్. వీరి సహధర్మచారిణి శ్రీమతి సావిత్రీదేవి. వీరు విశాఖపట్నం వాస్తవ్యులు. వీరిరువురు శ్రీశ్రీశ్రీ ముమ్మిడివర బాలయోగీశ్వర స్వామివారి పరమభక్తులు. శ్రీ స్వామివారు వీరికి ఇలవేల్పు, నమ్మిన దైవం. కష్టకాలమందు, ఆపదలయందు శ్రీ పెద్దబాలయోగీశ్వరస్వామి మరియు శ్రీ చిన్న బాలయోగీశ్వరస్వామి వీరికి ఆపద్బాంధవులుగా యుండిరి. ఈ పుణ్య దంపతులు శ్రీ బాలయోగీశ్వర స్వామి వారి కరుణ, దయ, ప్రేమ, సహాయ సహకారములు ప్రత్యక్షకముగా, అనుభవపూర్వకముగా చూసి ఉన్నారు. శ్రీ బాలయోగీశ్వర స్వామి పిలిచిన పలికే దైవం అని ప్రగాఢ విశ్వాసంతో స్వామివారిని కొలిచి తరించారు. వేదవేదాంగ సారాన్ని అతిసామాన్యమైన భాషలో, పామర జనానికి అర్థమయ్యే రీతిలో స్వామి చెప్పారని కవి శ్రీ రాజు గారు ఈ కవితా సంపుటిలో నొక్కి వక్కానించారు.

ఈ సంపుటిని తయారు చేసే ప్రయత్నములో వీరి ధర్మపత్ని మరియు వీరి కుమార్తె శ్రీమతి బాల ఇందిరలు చేదోడు వాదోడుగా ఉన్నారు. ఈ సంకలనాన్ని శ్రీ బాలయోగీశ్వర స్వామి వారికే అంకితము చేసిన వీరిరువురి జన్మ ధన్యమైనది.

తుల కొరకు సంప్రదించవలసిన చిరునామా :-


**డా॥ విష్ణు ప్రసాద్ కోటిపల్లి**

యం.యస్. (ఆర్థో), యం.సిహెచ్. (న్యూరో)

ఫెల్లో - మైక్రో న్యూరో సర్జరీ - జపాన్.

ప్రొఫెసర్ - న్యూరోసర్జరీ & చీఫ్ న్యూరో సర్జన్, ఉస్మానియా జనరల్ హాస్పటల్, హైదరాబాద్.

**న్యూరో క్లినిక్ 1-9-1122/5/డి, ఫస్ట్ ఫ్లోర్, ఆంధ్ర మహిళా సభ హాస్పిటల్ ఎదురుగా విద్యానగర్, హైదరాబాద్ - 500 044. ఫోన్ : 040 - 27608788, 27677524.**

**45-53-7/7, నర్సింహానగర్, విశాఖపట్నం - 530 024. ఫోన్ : 0891 - 2799865.**